# భావతరంగాలు

(ఏలలు, సుద్దులు, చిందులు,

బుర్రకథలు మొదలయినవి)

---

ఉన్నవ లక్ష్మీనారాయణ

---

చెన్నపురి:

ప్రకృతి శా॥ ముద్రాలయమున

ముద్రితము.

౧౯౩౭

వెల రు॥ 0-1-0

# భావతరంగాలు

## ౧

## ఏల

(సంగదాసు అను పంచమనాయకుని హత్య జరిగినతరువాత ఉత్తర క్రియలు జరుగు నప్పుడు చదువబడిన చరమ గీతము.)

1. వుండా నిల్లా-పండా నేలా-వండా పొయ్యా-వండా, నుయ్యా
అండ లేకా-వాలా లెండేరు ఓగాంధ దేవా! వంటి నుండా వసు
కుండేరు.

2. చేతా మంత్రే-హాలీ లేదు పోటా మంత్రే-నాలి లేదు
బిచ్చ మంత్రే-మాలీ గాదురా ఓసంగాదేవా! దేవుడీక జాలీ
లేగురా. వుండ.

3. తిన బోతే-మెతుకే సున్నా కట్ట బోతే-గుడ్డే సున్నా
తాగ బోతే-నీళ్లే మన్నారా ఓలోకా సంగా! పెల్చ బోతే గాతే
సన్నారా. వుండ.

4. ఇంటా వంటా-పంటాగబ్బా చుట్టు గుడిసె లన్ని నుబ్బా
బయట బోతే-మాకే దొబ్బారా ఓనిప్పంగా నీకు! సంగ రక్షా-
భిరుదా మబ్బారా. వుండ.

5. ఆశా మీలో-స్మరణా కోలా పోలీసులా-పోలీసుగాలా
యింత కష్టాలే-జైలు మేలేరా ఓగురు నాథా! మా జీవనమే మాకే
గోలారా. వుండ.



6. బాల్యమునా-పాలా ప్రాసా-పసుచుకుప్రా కైనా సొగసా
ముసలికైనా-బేడా కాపారా ఓవ్యాసంగా కాయూ! ఈ బ్రతుకు
మీదా-యేలా ధ్యాసారా. వుండా.

7. వెతలా మరపా-దక్క సారా పోలీసులా చేతా-చెపంగా
రాత్రి పగలూ-మాకే పహారారా ఓ గురు రాయా! దుఃఖములా-
నెడా గోయురా. వుండ.

8. మొక్క బోతే-నల్లే లేవు యొక్క బోతే-బల్లే రావు
కుదువ ప్రాటూకూల్లే లేవూరా ఓజ్ఞానా సంగా! చెరువ నైనా-బల్లే
లేవురా. వుండ.

9. బ్రాహ్మణూల-కెల్లా దూరం వైశ్య మణాలా-కెల్లం శెరం
శూద్ర జనులా-కెల్లా సారంరా ఓముక్తి సంగా! మే మెంగులకే
భూమీ భారంరా. వుండా.

10. ఆరంజ్యోతి-అమ్మ గాదా వసిష్ఠుడూ-తండ్రి గాదా
పారాశరుడూ-బంధువే గాదా ఓశిష్టా సంగా! ఇంత కంటె
శిష్టూ లెవరూరా. వుండ.

11. పరం త్పరుడు అయ్యా గాగా-పరమేశ్వరీ అమ్మగాగా
భేదమూలా-కేడా మేదిరా ఓ అజ్ఞానా దూరా! భేద వాదా-
మూలా మేదీరా. వుండా.

3

# ౨

## ఆవులకాపరులు

### మోహన – ఖండగతి – ఏక

### కాపుబాలిక

1. క్రొంగ్రొత్త బోయేటి – కోరబొల్లానా
సగము పరుగున బోయె – పాలబొల్లానం
మేత దావిణి బట్టె – మేలంపు టావా

మాచర్ల ఆవులు – మనవి గావోయి
మరపు చొప్పున బోయి – నాకు దెచ్చేరు.

### ఆవు

2. పాలాకు పచ్చలా – పరువంపు పసునా
ఆద్దాల రవికలా – ముద్దులా పసుచా
తంగేటి పూవులా – ధరియించు పసుచా

మాచర్ల ఆవులూ – మనవి కావేమి ?
మలిదేవు పెడ్డినా – మరలి వచ్చేవా.

### బాలకుడు

3. కోర కొమ్ముల తోటి – కొమరొప్పు బసవా
పులి మచ్చ వన్నెతో – పొలుపొందు బసవా
నీటి దాణివిబట్టె – నీలంపు బసవా

చంద్రు వంకా నీళ్ల – చాయబోకోయి
మాచర్ల మడుగులు – మరచి పోవోయి.

## బ స్వ వ డు

4. చిరి కోల బట్టిన - చిన్ని బల్లులారా
చద్ది మూటల నొప్పు - ముద్దు బాలురా
పిల్లనక్రో వూదు - పిన్న బాలుడా

మాచర్ల ఆడపులు - మనవి గాదేమి
బ్రహ్మన్న అడ్డితె - పారి వచ్చేమా.

## 3

## బు ర్ర క థ

### శంకరాభరణము - చతుశ్రగతి - ఏక

1. రామ రామ శ్రీరామా రామా - రామా రఘు రామ
తక్కెళ్ళ జగ్గని ధర్మ బోధలు-తలపున నిలపండి
ఆది కాలమున అందరు జనులు-అన్న దమ్ము లండి
నదులు వనంబులు నానా మృగములు-నాల్గు సంద్రములు
కొండలు వండలు జలములు పొలములు-కుంటలు సెల యేళ్లు.
కాయలు పండ్లు పాడి పంటలు-ఘన మయినా యిండ్లు
అంతరువులా భేదము లేక-అందరి సొమ్మండి
కుడవా గట్టా వొకరికి బెట్టా-కొదవే లేదండి
నానీ భేదము లేక లోకము-నడుస్తు వుండేది
మనసు లోపలా చీకుచింతలు-మందుకైన లేవు
తొత్తుల దొరల భేదము లేని-తోడు బంటు లండి
అందల మెక్కే మోసే భేదము-లసలే లేవండి
ధనికుల పేదల తారతమ్యముల్-తలలు జూపలేదు

అరుకువ ఆకలి బాధ లప్పుడు-అంకు రించ లేదు
ధనమును గొల్చే దుష్టగోష్ఠులు-దాప రించ లేదు
తిరిపెము కొరకై ధనికుల బీసలు-దేవురించ లేదు
పూటకెకి గుడ్డకు గుడ్డి కంటులు-గోడు జెంద లేదు
మాపులు రేపులు మలమల మాడును-మాల లెంత లేదు
భోగ్యము లొక్కటి వస్తు లొక్కటి-పొందియుండ లేదు
దొరలు మత్తులై నీచ భోగముల-దొర్లు చుండ లేదు
పాటు పడడమే పరువు తక్కువను-భ్రాంతిలో పడ లేదు.
రామ రామ శ్రీరామా రామా-రామా రఘు రామ.

2. తొక్కల్లి జగ్గని ధర్మ బోధలు-తలపుల నిలపండి
కృత యుగ మందలి ధర్మము లెల్ల-క్రిందు మీదు గాగ
పాపము తోటి కలియుగ మంత-పండ పోయె నండి
పాప ధర్మములు లోక మంతట-పరిసి పోయె నండి
యెక్కడ జూచిన ఆర్భాటములె యెక్కడ ఘోషములె
యెక్కడ జూచిన పోట్లేలండి-యెక్కడ కలవరమె
సన్మార్గంబున జీవ యాత్రలు-సలుపుట దుర్ఘటము
లోక మందున చక్రవర్తియై-లోభు డేలు చుండు
లోకము లోని ద్రవ్య మంతయు-లోభుల పరమయ్యే
అంతా నాదే అంతా నాదే-అందురు జనులండి
అంతా మనదే యనెడు రోజులు-అంతరించె నండి
పరుగిడు కాకులు యిండ్ల మీదుగా పార వెరచు నండి
యెంగిలి చేయి కాకుల పైపు-విసరదు యిల్లాలు
నారాయణమ్మలు యిల్లై యంటు నడతురు యింటింట.
యెవరో కొందరు అరుపు కొందురు-యెల్ల ద్రవ్యములను
కోటి కొక్కరై వున్నారండి-కోటీశ్వరు లంటు

కుచేలు లంపెరు అయినా రండి-కోట్ల కొలది గాను
కోటీశ్వరుల కనిష్టి బిడ్డలు-కోట్లకు కర్తలట
మనుమలె గాదు మనంతరాలు-సాగ సౌఖ్యా లంట
అరువు జెప్పితే అడ్డగ కూలి-పనికి పాతి కెంట
రామ రామ శ్రీరామా రామా-రామా రఘు రామా

౩. తక్కుడ జగ్గని ధర్మ పన్నముల్-దలచి బ్రతుక రండి
ధనికులు బొర్రల నిమురు కొందురు-తలప రొకరి బాగు
చేతుల వేళ్ల పనులు ముట్టక-చెడి సోమరు లయిరి
కాలి మీదనే కాలు వేసుకొని-కాలం బుచ్చేరు
భాగ్య వంతులకు బీద లెల్లరు-బానిస లయినారు
పొద్దు గూకులు చాకిరి జేస్తురు-బొక్కెడు కూటికిగా
యెంత జేసినా తృప్తిలేదయా-యజమానుల కెల్ల
రోగం రాని నొప్పి రాని-నాగా దప్పదయా
కూలికి విలువ గలదని మీరు-గుట్టు తెలుసు కొండి
కూలికి దగిన విలువ బుచ్చుకొనే-కూలికి మరి పొండి
నీళ్ల కూలికి వొప్పు కొంటిరా-నెనరు జెరుపు కొంద్రు
పని వాండ్లందరు యేక మయితిరా-ప్రపంచమే మీది
ఐకమత్యమే అన్ని పనులకు-ఆధారము సుండి
శ్రేణులు గట్టి సమ్మె గట్టితే-చెల్లును మీమాట
కొట్టా వద్దూ తిట్టా వద్దుకోర్కెలు నిడి వేరుకా
అసహాయ యోగము తరుణము చూచి-అవలం బించండి
దానికి మిగిలిన మంత్ర తంత్రములు-ధరలో లేవండి
శంకలు దక్కి మీరలెల్లరు శపధము జేయండి

సమతా ధర్మం ప్రపంచ మందున స్థాపింతురు గాని
కృత యుగ ధర్మం లోక మంతటా కుదుట బెట్ట గలరు
రామ రామ శ్రీరామా రామా-రామా రఘు రామా.

## ౪

## దయ్యాలపాట లేక ప్రళయ గీతము

## (సుద్దులు)

### వరాళి - ఖండగతి

-. ఓభైరవీ దేవి-ఓభద్ర కాళి
ఘేతాళ కాటిగా-పెద పోతు రాజ
పుర్రె దండల నొప్పె-భువ నైక మాత
శింబోతు చాడమ్మ-చెండి శివశక్తి
కంఠాలు నులుపేటి-కంబాలనాగి
మారెమ్మ అంకమ్మ-మద్దిరాలమ్మ
రండెల్లి పోదాము-రణరంగమునకో

2. కత్తులు అంబులు-గండ్ర గొడ్డండ్లు
ఈటెలు బాకులు-విచ్చు కత్తులును
పెద్ద ఫిరంగులు-భిండివాలములు
రంపాలు బరిసెలు-రహి నొప్ప బట్టి
ఆవేశ పర వశు-లైన సైనికుల
కావ్విన గుఱ్ఱాల-గొఱ్ఱె పొట్టేళ్ళ
పీకుల రొమ్ముల-ఏనుగు తలల
చిదిమి ముక్కలు గాగ-చీల్చు తున్నారో.

3. కారేటి రక్తాన్ని-కలగల్పు జేసి
కడవల బానల-గాబుల నింప
పట్టించి వుంచుతా-పానకంబునకు
తందనా లాడుతూ-తాగుదురు గాని
తలకు బోసు కొనండి-తాన మాడండో.

4. కొట్లాగ శవములు-కోయించి నాను
కుప్పలు వేయించి-కుళ్లి పోకుండ
ఎండ బెట్టించాను-కొండల యెత్తు
పీనుగు గుట్టల-పేట లమర్తు
కేరింత లాడుతు-కేకిసలు గొడుతు
బువ్వంపు బంతులు-పొలుపు మీరంగ
తిని తిని మీరెల్ల-త్రేపంగ వచ్చో.

5. కండల ముక్కల-కారుల బట్టి
కుమ్మ్రన బెట్టించి-కొద్దిగా కాచి
కరపచ్చి ముక్కల-కమిలి పోకుండ
కొత్త నెత్తుటబెట్టి-కోరలబట్టి
చెలిమెల రక్తము-చిమ్మికారంగ
పలల ఖండములను-బక్షింత్రు గానో

6. పుట్టెల నెల్లను-పోగు బోయించి
తేరిన నీళ్లలో-తెల్లగా గడిగి
పెట పెట లాడంగ-పేలాలు వేచి
పొడి పిండిగొట్టించి-బొక్కుదురు గానో

7. కోట్లాది శవముల-గుట్లు వోలిపించి
నులి వెచ్చ రక్తము-నూనెయు గలిపి
గంగాళముల బట్టి-కని గుడ్లు బోసి
గట్టి పకోడీల-కరణి వేయించి
భేతాళ గణముకు-బెట్టింతు విందో.

## ౫

## యశోదా వైభవము

(వేదాంతపరిభాషలో మనోరాజ్యము అను సాధనను సూచించును)

1. నాదు ముద్దుల మొలక - నా రామ చిలుక
చిన్నారి పొన్నారి - చిరి పొన్న కాయ
నాదు నోముల పంట - నారాము జంట
పాడరా పాపాయి - ఆడరా తండ్రి-నాదు.

2. అగరు నూనె బెట్టి - అంటేను తలను
పచ్చ కర్పూరంపు - నలుగు బెట్టేను
పన్నీటి కడవల - లాల బోసేను
ముద్దులు గులకరా - ముత్యాల సరమా - నాదు.

3. నీలి మబ్బుల నేరు - నెమిలి రాయుండ
రంగు రంగుల రుమాల్ - చుంగులు చెక్కి
కలికి తురాయినీ - కమరంగ బెట్టి
గల్లు గల్లున మోగు - గజ్జెలు గడుదు - నా.

4. తేనె పాటలు రేగె - దిక్కులు పాకి
పాల కరుళ్ళపై - పరుగులు దీసె

ఈరెదు లోకాలు - వెక్కుస మంది
సంతోషమున పొంగి - సాక్కి సోలంగ-నా.

5. చిన్ని పెదవుల తోటి - చిరు నవ్వు నవ్వి
ఎఱ్ఱ బుగ్గలతోటి - వెలు గార నవ్వి
పాల బుగ్గల తోటి - పకక్కున నవ్వి
చూపరా స్వర్గంపు - చోద్యాల నెల్ల.

## ౬

1. గొల్ల పిల్లల అల్ల రొద్దురా - పోకిళ్ల పొన్నా
నలుగురి నోట - నాన వద్దురా.

2. గుప్పిటి నిండ - పప్పులు బెట్టేను - ఒప్పుల కుప్పా
తియ్యాన్ని - తాయం బెట్టేను.

3. చుంచు గువ్వి - పించెం బెట్టేను - అందాల చుక్క
విల్లంగోడు - చేత బెట్టేను -గొల్ల

4. పట్టు కుచ్చుల - దట్టి గట్టేను - ముద్దుల మువ్వ
బుజ్జి బొజ్జకు - గజ్జెలు చుట్టేను-గొల్ల

5. బబ్బ బోసి - జుబ్బా దొడిగేను - బంగారుకొండ
బబ్బో బెట్టి - చిచ్చి గొట్టేను-గొల్ల

## ౭

## రోటి పాట

### మధ్యమావతి - త్రిశ్రగతి - ఏక

1. సాధన చతుష్టయపు - సంపత్తి గన్న
అతడె పో సద్గురూడు - అతడే పరశివుడు.

2. వర్ణాశ్రమాచార - వావి దప్పితే
తారు మారై పోను - ధర్మము లన్ని

3. పల్నాటి రాజులు - పాటి దప్పేరు
మాచర్ల దప్పేను - మారాజు కపుడే.

4. కదుల్లే కత్తులు - నెదుల్లే గదలు
రండెమ్మ మీరంత - దండు బోదాము.

## ౭

## తంధాన పాట

పల్నాటి మిద్దెలకు వాసాలు లేవు
కొండీటి బ్రాహ్మలకు - మీసాలు లేవు
మాచర్ల కోళ్లకు - రోసాలు లేవో - తంధాన.
మాచర్ల దొరలకు - వేసాలు లేవు
అజ్ఞాన చేట్టలకు - దోసాలు లేవు
పల్నాటి రెడ్లకు - రోసాలు లేవో - తంధాన.

## ౮

## చిందు పాట

### పల్లవి

విడదలో-విడదలో-విడదలో-విడదలో

### అనుపల్లవి

అందరూను ఆంధ్రులో - అందరూను ఆర్యులో వి.

## ౧౨

1. మాలలకును మాదిగలకు - ఎరుక లేనాడులకును
ఆది మాంధ్రులైనవారి - కంపెరికిని విడుదలో - విడుదలో

2. తాగ నీళ్ల బావులూ - తానమాడె చెరువులూ
చాప కూళ్ల సత్రశాలలు - సామి వారి పూజలు - విడుదలో.

3. ఆండ రెమ్మ పాలు యిచ్చె - అంప రెయ్యి బువ్వ బెట్టె
కల్ల బొల్లి భేదములకు - కారణముల తెల్పరో - విడుదలో

4. కట్టెలన్ని మట్టి వాయె - కట్టెలోది దేవుడాయె
కట్టె కట్టె నడుమ మనకు - వట్టి భేద మెట్టెనో - విడుదలో.

5. నీవు నేను నీళ్లు నిప్పు-చెట్టు పుట్ట గట్టు మిట్ట
చేప జెల్ల దేవుడైతె - చెప్ప రాని దేవుడురో - విడుదలో.

6. అంట రాని దేవుడంట - అంట వచ్చె దేవుడంట
చదువు కున్న వాళ్ల కంటె - చాకలోళ్లె మేలుగో - విడుదలో.

7. అందరి నొస్ట పొద్దు బొడిచె - అందరి నొసట పొద్దు గూకె
ఎల్ల వారి కంటె నీవు-ఎక్కు వేల చెప్పరో - విడుదలో.

8. నిన్ను గొడితె పాలు గారి నన్ను గొడితె నీళ్లుగారి
గొప్ప కొద్ది రకము లిందు-కలవొ లేవొ తెల్పరో - విడుదలో.

9. ముప్పై కోట్ల దేవతలతో-ముచ్చటైన పుణ్య భూమి
బానిసత్వ మనెడు పాడు-పంట లేల పండెరో - విడుదలో.

[వీరమ్మ అనే ఆమె కృష్ణాజిల్లా ఉయ్యూరు కాపురస్తురాలగు గొల్ల మనిషి. ఈమె తన భర్త చింతయ్య అను వానితో సహ గమనము గావించిన కథ నాటకముగ వ్రాయ బడ్డది. ఈ క్రింది పాట లానాటకములోవి.]

# ౧౦

## పువ్వు పాట

(నాగమ్మ అను ఆమె తాను ప్రేమించిన పురుషునకు తనను ప్రేమించనందున తన ప్రేమను వెల్లడించక పువ్వును భావించి మనో భావములను చెప్పుకొనుట.)

1. కొమ్మలలో నక్క-కమ్మ తావుల నెల్ల
గుమ్ము గుమ్మన జల్లు-పువ్వా
రాజు లేని యట్టి - రాత్రి రాణించునా
రిక్క లెన్నున్ననూ - పువ్వా.

2. కమ్మ తేనియ లెల్ల - కన్నీటి ధారలై
కాల్వలు గట్టినా - పువ్వా
అందని పండ్లకై - అఱ్ఱు చాచుటే కాని
ఆశలీ డేరునా - పువ్వా.

3. మండు వేసవిలోన - ఎండ వేడిమి కొట్టి
వాడి వత్తయి పోయి - పువ్వా
చాలి నిద్దుర బోయి - సావాస గానిపై
చక్కనీ కలగనవె - పువ్వా.

4. ఆకులలో అణిగి - మాకులలో మణిగి
మగ్గి మాయము గావె-పువ్వా
పదుగురిలో వెల్లడై - పలచ డనమే కాని
పసయేమి జెప్పవే - పువ్వా.

5. ఇవ్వేళ యింటిలో - యెగిరి పడపమె గాని
ఇదిని త్తేమా మనకు-పువ్వా
మరు విమిష మే జూడ-మంటి మీదను రాలి
మలినమై పోతుందె-పువ్వా.

6. ఈలోక మర్యాద-లిరుకు లన్నీ దాటి
యెగిరి పోయినాకనో-పువ్వా
ఓపిన మట్టుకు - వలపు సంద్రము లోన
ఓల లాడుదు గాని - పువ్వా.

## ౧౧

## మే క పా ట

(వీరమ్మ పేరంటాలు తన గొల్ల బోయుడు అడవికి మందలు గాయ బోగా ఒక మేకను అతని యోగక్షేమము లడుగుట.)

1. పొలము వెంట దిరుగు కుంట-బొల్లి మేక
మా బోయుణ్ణి చూశావం టె-బొలి మేక ?
పొలము లంక తిరుగు తుంటి-బాగ్గె శాలె
నా పోతు వంక జూసు కుంట-బాశాలె.

2. మేక పోతును చూసుకొంటు-బొల్లి మేక
మా మేన మామను జూడలేద-బొలి మేక ?
మేక పోతును చూస్తుం టె-బాగ్గె శాలె
మేతమీదా మతి బోదె-బాశాలె.

3. కొంకి కట్టి గొంగడి గూడ-బొల్లి మేక
నా గుట్టు కొల్ల గొంటాయె-బొలి మేక

బైరి గడ్డం పల్ల తోక-బాగ్గ శాలె
నా బైసి తీసి వేస్తాయె-బాశాలె.

4. కోరమీసం గీటితేను-బొల్లి మేక
నా కనుల పండు గాతాదె-బొలి మేక
కోరకొమ్ము చూస్తేను-బాగ్గశాలె
నా గుట్టు కోలు పోతాదె-బాశాలె.

5. బారు టంగలు వేస్తాడె-బొల్లి మేక
నా బాగ్యాల రాసి వాడే-బొలి మేక
చిటుకు పొటుకు దూకు తుంటె-బాగ్గశాలె
నా చింత లెల్ల తీరు తాయె-బాశాలె.

6. తేనె పలుకు పలుకుతాడె-బొల్లి మేక
తెలి నవ్వులు చిలుకు తాడె-బొలి మేక
అలిగండ్ల చూపులాకు-బాగ్గశాలె
నా కడ గండ్లు బాసి పోనె-బాశాలె.

7. ఎండ కెండి వాన దడిసి-బొల్లి మేక
చల్-జోగి కంటె చాగివాడె-బొలి మేక
ఆకు మేసి అలమునవిలి-బాగ్గశాలె
రాగి బోగి చాగివాడె-బాశాలె.

8. కల్లా కాడు లేని వాడె-బొల్లి మేక
గొల్ల డయినా గొల్ల డమ్మ-బొలి మేక
చిట్టు బుస్సు లెరుగ నట్టి-బాగ్గశాలె
మేక మెత్తని వాడమ్మ-బాశాలె.

## ౧౨

## సంగీత నాప సాని - తోటపాట

## (తిక్కన అను నవలనుండి తీయబడినది)

1. మావి సున్న మీద - మరుగున దాగుండి
        పేకను పూదేటి - కోకిలమ్మ
    గిల్లి బుల్లి యిసుల్లు-గిల్లి నీకు బెట్టి
        గొంతు చక్కగ చేసు-కోయ వమ్మ.

2. మల్లె పూరెక్కల - మాటున నక్కుండి
        తూ-అని పాడేటి - తుమ్మె దమ్మ
    తీయని పూదేనె - తీసి నీకూబోతు
        కల రవమున సుతి-గలపవమ్మ

3. తోక విప్పు కోని - తాకిుమ్మని
        తైతక్క-లాడేటి - నెమిలమ్మ
    గురివింద పూసల - కులికంటూ కీయిస్తు
        అల్లిబిల్లి నాతో - ఆటే నమ్మ.

4. అంబర మార్గాన - అల్లల లాడుచు
        వుయ్యాల లూగేటి - తీగసాని
    చేతిలో- చెయి బెట్టి-చెట్టు పట్టాల్ బట్టి
        తెమ్మెర గాలికి - తిరుగ రమ్మ.

---